శ్రీ

# జాతివర్ణాశ్రమధర్మములు.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచళ్ళం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రుండగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.



బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926.



వెల అ. 0—8—0

# “ జాతి ”. “ Caste ”

“ The evolution of variety from unity,” says “ Griger seems to be the great fundamental law of all development of nature and of mind ”. Life is evolution and evolution is development from the simple to the more complicated forms ”

ఋగ్వేదకాలమున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను జాతినిర్ణయ ముండెనాయను విషయము విమర్శనీయముగ నున్నది. కొంద ఱుండెననియు కొందఱు లేదనియు వాదించుచున్నవారు. శ్రుతిస్మృతులకుఁ దమవాదమునకు దగినయర్థము సేయుచున్నారు. గజకచ్ఛపముల పోరురీతిగ నీవాదము బహువత్సరములుగఁ బెరుఁగుచున్నది గాని విఱుఁగదు. గ్రంథములు చూచినకొల్లను, సందేహములు హెచ్చుచున్నవి. సాత్త్విక, రాజస, తామస గుణానుగుణ్యముగ, జాతులేర్పడెనని కొందఱు. అటులయిన నీ జాతులు పుట్టుక పైనవచ్చినవికావు గుణముల పైన వచ్చినవియని యేర్పడును. ఈ వాదము సర్వజన సమ్మతముగనుండినను, నైదువేలేండ్లుగఁ బారంపర్యముగవచ్చి జనుల హృదయమునఁ బాదికొనిన యభిప్రాయమిపుడు మార్ప నిష్టపడరు. ఇట్టిజాతివారు గొప్పవారనియు నిట్టి జాతివారు హీనులనియు వాదించుటకుఁ దగిన బ్రాహ్మణములును బురాణములును నేర్పడినవి. అన్నిటికిని బీజము ఋగ్వేదమనునది తెలిసినవిషయమేను. ఈ జాతివాదమునకు నదియే మూలాధారము. ఋగ్వేదమునం దీజాతులనామము లనేక ఋక్కులందచటనచట సూచింపఁబడియుండినను రెండు ఋక్కులందు మాత్రమించుక విశేషముగఁ దెలుపఁబడినది. మొదటిఋక్కీవిధముగ నున్నది. దాని ఛాయార్థ మీక్రింద వ్రాయఁబడినది.

ఉషఃకాలదేవత ప్రాతఃకాలమున నందఱిని నిద్రలేపునని వర్ణించుచు

మం. 1. సూ. 113. ఋక్కు 6. “ ఒకనిని నేలుటకును, నొకనిని యశమార్జించుటకును, నొకనిని ద్రవ్యమార్జించుటకును, నొకనినిఁ బనిపాటొనరించుటకును, నందఱినిఁ దమతమ పనులొనరించుటకును, నీరీతి నన్ని జంగమ భూతములను నుషఃకాలదేవత లేపును ”

ఈ ఋక్కునుఁబట్టి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతులను ఋగ్వేదము నిర్ధరించెనని పలుకుదురు. పై ఋక్కులో జాతినిర్ధారములేదని నాకుఁదోఁచెడు. ఉషఃకాలదేవత, సర్వులనునిద్రలేపి, వారువారొనరింపఁదగిన పనులకుఁబంపుచున్నదని యర్థము. దీనిపైన జాతుల విభజన నిర్ధరించుటకును, నటులేర్పడినవారే పైనఁ బలుకఁబడిన కర్మములొనరింపవలెననియు నర్థము సేయుట సమంజసముగాదు.

ఇంక ఋగ్వేదమునందుఁ బదియవమండలములో నొకముఖ్యమగు ఋక్కున్నది. జాతి నిర్ధారణమునకది ముఖ్యాధారమని నమ్మఁదగినదిగ నున్నది. కాని దానియందున్నత మిదియే సత్యమని నిర్ధరించుటకు మార్గములేదు. ఆ సూక్తార్థము సంపూర్ణముగ నిచట వ్రాసినాను.

10. 90-వ సూక్తము
పురుష సూక్తము

(1) వెయ్యితలలును వెయ్యికన్నులును వెయ్యిపాదములును గల పురుషుఁడుండెను. ఆ పురుషుఁడు ప్రపంచము నంతయును వ్యాపించుటయగాక, దానికంటెను బదియంగుళము లతిక్రమించి యుండెను.

ఇది ప్రారంభ ఋక్కు. ఈ ఋక్కులోని సహస్రయను శబ్దమునకు ననేకములని యర్థము. వెయ్యితలలును వెయ్యికన్నులుంట యసంభవమని పోల్కి యొనర్పఁదగదు. భూమియందంతరాళములెల్ల నిండియుండెనని భావింపవలెను. ఈ పురుషశబ్దము పుల్లింగ మహాత్స్వబ్దముగ నుండినను దానియర్థము, మేరమీఱిన సర్వలోకములునుగల ప్రపంచమని మనమూహింపవలెను. పురుషతత్త్వగర్భిత ప్రకృతి యని భావమగును. "అత్యతిష్ఠద్దశాంగులం" యను వాక్యమొకటియున్నది. దానికిఁ బ్రకృతిగర్భిత పరమాత్మయని భావము, వేదాంతశాస్త్రములోని ముఖ్య సారాంశ మీ చిన్నఋక్కులో నిండియున్నది. సృష్టికిమున్ను పరమాత్మ ప్రకృతి యంతయును వ్యాపించి, పైనఁ దానికి శిఖరముగఁ దాను నిలిచియుండెనని మన మూహింపవలెను.

(2) సర్వప్రపంచమునందును నుండునదియు నుండఁబోవునదియు నా పురుషుఁడేను. వాఁడమృతత్వముగలిగి వృద్ధినందువాఁడు.

(3) అంతటి గొప్పవాఁడతఁడు. వానిలోఁ జాతుర్భాగ మీ ప్రపంచము. మిగత ముక్కాలుభాగము స్వర్గముననుండెను. స్థిరమగు ప్రాణమది.

(4) ముక్కాలుభాగముతోఁ బురుషుఁడు స్వర్గమందెను. ఒకపాదమిచట నిలిచెను. ఈ భాగము, ప్రపంచమంతయును చరాచర వస్తువులలోనెల్లను తానై నిలిచెను.

పై నాలుగు ఋక్కులలోను సృష్టికిమున్ను ప్రకృతిపురుషు లెటులుండినదియు తెలుపఁబడినది. పిదపనుండు ఋక్కులలో సృష్టి ప్రారంభమయినది.

(5) పురుషునుండి విరాజుపుట్టెను. ఆ విరాజునుండి మఱలఁ బురుషుఁడు జనించెను. పుట్టినతోడనె భూమి రెండుకొనలు వ్యాపించెను. (ప్రాక్పశ్చిములు)

ఈ ఋక్కునుండి సృష్టిప్రారంభమైనది. ఇంతకుమున్ను ప్రకృతిపురుషు లొకరిలో నొకరైక్యభావముగ నుండిరి. విశేషకాల మిటులుండినపిదప వియోగ కాలము తటస్థించెను. ప్రకృతి యెపుడును చాంచల్యముకలది కావున సమయము వచ్చినపుడు పురుషుని వియోగమందెను. అయినను పురుషుఁడు తనసార మించుక ప్రకృతిలో నుంచెను. అట్టి ప్రకృతినామము విరాజని పిలువఁబడినది. ఇపుడు ప్రకృతి పురుషులు స్త్రీ పురుషులుగ మనము భావింపవలెను. ప్రారంభమునఁ బురుషుఁడు ప్రకృతితో నేకాంతముగ నుండెను కావున ద్విలింగోపేతుఁడుగ నుండెను. పిదపఁ బ్రకృతిభాగమును వదలెను. వదలినభాగము స్త్రీగఁ బరిణమించి విరాజనామమునఁ బ్రసిద్ధికెక్కి రెండవపురుషుని వనఁగ విరాట్రూపునిఁ గనెను కావున నవిరాజ్ రూపము భార్యయనియు పురుషుఁడు భర్తయనియు రెండవపురుషుఁడగు విరాటు సుతుఁడనియు ప్రాపంచకరీతిగ బాంధవ్య మేర్పడెను. "ఆత్మావై పుత్రనామాసి" యను వచనము గలుగుటకుఁ గారణమాయెను. క్రొత్తగఁబుట్టిన రెండవ పురుషుఁడే సృష్టికి మూలాధారుఁడాయెను. ఋగ్వేదమునఁ గొన్నిఋక్కులలో దక్షుఁ డదితినిఁ బుట్టించెను. అదితి దక్షునిఁ గనెననియున్నది. దాని యంతరార్థమును గానక యితరమతములవారు హిందూదైవములకుఁ దల్లి చెల్లెలు బిడ్డయను వావి వరుసలు లేవనియు వారు నీతిబాహ్యులనియు హేళియొనర్చుచున్నవారు. పై సృష్టి క్రమము చక్కఁగ నాలోచించరేని వారొనరించునట్టి హేళనకుఁ గారణ మే మాత్రములేదని వారే తెలియుదురు.

ఈ రెండవపురుషుని బంధించి దైవములు నరమేధమొనర్చిన విషయ మీ పురుషసూక్తము తెలుపుచున్నది. ఈ యాగ మొనరింపఁదగిన వస్తువులు కావలయునుగదా! దానికినై యా పురుషుని ఛేదించిరి. అపుడు

(6) వసంతఋతువు ఘృతమాయెను. గ్రీష్మఋతువు కాష్ఠములాయెను. వర్షఋతు వాహుతులయ్యెను.

(7) దర్భపైఁ బురుషునిఁ గూర్చుండఁబెట్టి యభ్యంజనముఁజేసిరి. దేవతలు సాధ్యులు ఋషులు, వానినిఁ బశువుగ నొనరించి వానియనుగ్రహముఁగోరి బలి యిచ్చిరి.

(8) యాగమయినతోడనె వారచట జాతిపడిన క్రొవ్వు మొదలగు వస్తువులను పోగుచేసిరి. అవివిహంగ జలచర గృహారణ్య జంతువులుగ నయ్యెను.

(9) ఈ గొప్ప యాగమునుండి ఋక్సామములును ఛందస్సును బుట్టెను. అందున యజుర్వేదము బుట్టెను.

(10) దానినుండి గుఱ్ఱములును రెండు చాలులందును దంతములుగల పశువులును బుట్టెను. గోవులు మేఁకలు గొఱ్ఱెలుఁ బుట్టెను.

పైన వ్రాయఁబడిన పదిఋక్కులలోను నీ సూక్తము రచించిన ఋషి సృష్టికిఁ గావలసిన వస్తువులన్నియును చక్కఁగఁ బలికెనుగాని తన్నుఁ దానేమియును బ్రశ్నించికొనఁడాయెను. పిదప నా మహాఋషి మానసంబునకు నేమి సందియముఁ దోఁచెనో యా విషయమునుగుఱించి ముందు వ్రాయఁబోవు ప్రశ్నలు తా నేవేసికొని సమాధానములు వ్రాసినాఁడు. ఏరీతియన

(11) దేవులు పురుషుని విభజించినపుడు, ఎన్ని భాగములు వానిని ఛేదించిరి? వాని ముఖమేమి? వాని బాహువులేవి? వాని పాదోరువులేమి?

ముఖంకిమస్య కాబాహూ కా ఊరూపాదఉచ్యతే ॥ అని మంత్రము.

ఈ ప్రశ్న లడుగుటకుఁ గారణము లేమయినదియు నాకుఁ దెలియక యున్నది. వెనుకనున్న పదిఋక్కులు ముఖ్యమయినవిగ నుండినను నిట్టి ప్రశ్న యొకటియైనను లేదు. ఈ ప్రశ్నలకు సమాధానములు కలిగినదియే ముందు వ్రాయఁబోవు ఋక్కు. ఆ ఋక్కే జాతివిభజన ఋగ్వేదము కాలమున నుండెనని మనకెల్లరకుఁ దోఁపనిచ్చు ఋక్కు దానినిఁదప్ప నీ జాతివిషయమునఁగల విభజన మఱియేఋక్కులందును లేదు. కావున నా ఋక్కును నిచట ఋగ్వేదమునుండియే యెత్తివ్రాసెద.

బ్రాహ్మణోస్యముఖమాసీత్,
బాహూరాజన్యకృతః ।
ఊరూతదస్యయద్వైశ్యః
పద్భ్యాగుంశూద్రోయజాయతా ॥

(12) వానిముఖము బ్రాహ్మణుఁడయ్యెను బాహువులు రాజన్యులైరి. తొడలు వైశ్యులు పాదములు శూద్రులు.

(13) మనస్సునుండి చంద్రుఁడు పుట్టెను కనులనుండి సూర్యుఁడుపుట్టెను. ముఖమునుండి యింద్రాగ్నులు పుట్టిరి. శ్వాసమునుండి వాయువుపుట్టెను.

(14) నాభినుండి గాలిపుట్టెను శిరస్సునుండి యాకాశముపుట్టెను. పాదములనుండి భూమిపుట్టెను. వీనులనుండి దిక్కులుపుట్టెను. ఈరీతినిఁ బ్రపంచమేర్పడెను.

(15) దైవము లాపురుషునిబంధించి యాగబలికి సిద్ధపఱచునపుడు సప్తావరణములగు రీతిఁ గట్టెలునిలిపిరి. మూఁడేడుల కట్టెలు వరుసగాఁ చేర్చిరి.

(16) ఈ కర్మ మొనరించి దేవతలు యాగకర్మమునలువు స్వాతంత్ర్యము దెచ్చుకొనిరి. ఇవియే కర్మవిధులుగ నేర్పడెను

పై యర్థము ఛాయార్థము. ఈ సూక్తమతి నవీనమనుటకుఁ బాశ్చాత్య పండితులగు మూయర్ మాక్సుముల్లరుగారు కనుపఱచిన కారణములలో నీ దిగువ వ్రాసినవికొన్ని:—

(1) పురుషసూక్తభాష నూతనము. వేదభాష పురాతనము.

(2) వేదమున నెచట నగపడని గ్రీష్మశబ్ద మిందున్నది.

(3) వసంతయను శబ్దము వేదమున మఱియొకచోటమాత్ర మున్నది. అదియు నవీనమగుబుక్కు.

(4) బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రుల విభజనవేద మందెచటనులేదు. ఈ సూక్తమునందున్నది.

ఈ సూక్తము నూతనమనుటకు సందియములేదు. పదియవ మండలమెటు పుట్టినదను విషయము నిదివరలో నాచే వ్రాయఁబడినది. సూక్తమెంత నూతనమైనను నాలుగైదు వేలేండ్లకుఁ దక్కువగనుండదు. అధర్వవేదములోసైత మీ సూక్తము కొన్ని భేదములతో నున్నది. సూక్తము నవీనమైనను నిందూహింపఁబడిన సృష్టిక్రమ మత్యద్భుతముగ నున్నది. జగత్సృష్టికిఁ బూర్వము ప్రకృతి పురుష సంయోగం బవిచ్ఛిన్నముగ నుండినది. అనఁగా నేకాండమై యేకాంగమై యుండినది. ప్రకృతిస్వభావ చిత్రమహిమచే ( Natural phinomina ) వియోగ మవశ్యకమయ్యెను. వియోగానంతర సృష్టిప్రకృతి చలనమహిమ:— పురుషశబ్ద మిచటఁ బ్రకృతియుఁ బరమాత్మయు నొక్కటిగ నేకాండముగ నున్నవిధమును జూపట్టును. అవి రెండును భిన్నించునపుడు పరమాత్మాంశ మించుక ప్రకృతియందు లియ్యమై పరమాత్మనంటి, గొలుసులోనొక చిలుకువలె నుండును. ప్రకృతియందుఁ జేరినది జీవాత్మ. ప్రపంచమెల్లనిండి, ప్రకృతిసంబంధము తప్పించుకొనియును దప్పకవ్యాపించికొనినది పరమాత్మ. ఈ మహిమఁ దెలుపునది పురుషసూక్తము. ఈ పురుషయాగ మొనరించిన దైవములు ఋషులని పలుకఁబడినారు. సర్వప్రపంచము పురుషమయమయినపుడు వీ రెచటినుండి వచ్చిరను శంక కలుగవచ్చును. ఏ వస్తువును బురుషభావమని పురాతనార్యులు తలంచి పుల్లింగ మహత్సబ్దముగ వర్ణించుట పురా

తన ఋషుల్లవాడుక. ఆ వాడుకరీతిని పరమాత్మ సాంబంధిక ప్రజ్వాల్యమాన వస్తువులకు, దైవములనియు, ఋషులనియు పేరిడినారు. ఆ వస్తువులు మరలఁ బరమాత్మతో నైక్యమగుటకుఁ జేయు కర్మమే పురుషమేధము. దాని చలనమే పురుష విభజన కర్మము. ఇందులఫలము విరాజరూపమునఁ గలిగిన హిరణ్మయాండము, దానిచలనమునఁ గలిగినది రెండవ పురుషాకారము. సృష్టి యిచటఁ బ్రారంభమైనది. స్కాండినేవియన్లు సృష్టిక్రమము తెలుపునపు డిట్లనే ప్రపంచమంతయు “ యమిర్ ( Zimir ) యనువాఁడుగ నుండెననియు పర్వతములు వాని యెముకలనియు నాకాశము వానికపాలమనియు సముద్రము వానిరక్తమనియు మేఘములు వాని మెదడనియు వ్రాసినారు.

ప్రతివస్తువు ద్విలింగోపేతమని నే నిదివరలో వ్రాసినాను. పురుష సూక్తములోని పురుషరూపము సైతము ద్విలింగసహితము. శక్తిఫలము చలనము. శక్తిబలమున విరాజునుండి రెండవ పురుషజననమని యుండుటవలన విరాజ రూపము ప్రకృతినామక స్త్రీ స్వరూపకమని పండితులు భావించిరి. రెండవ పురుష జననమునుండి, “తజ్జాయా జాయాభవతి యదస్యాంజాయతేపునః” యనునుడియు; “ ఆత్మావై పుత్రనామాసి ” యను నుడియు నుద్భవించుటకుఁ గారణమయ్యెను.

ఈ సూత్రమునందలి “ అత్యష్ఠద్దశాంగులం ” యను వాక్యము పరమాత్మ సాంబంధిక జీవాత్మ నివాసార్హమగు సూక్ష్మశరీరప్రమాణమును దెలుపును. దైవములు ఋషులీ పురుషమేధ మొనరించిరనినఁ బ్రకృతిసాంబంధిక స్థూలతత్త్వములనుండి, సూక్ష్మతత్త్వములు, స్థూలాతీత బ్రహ్మమునుఁ జేరుటకుఁగాను నొనర్చిన యాగమని యర్థము. ప్రపంచంబంతయును బ్రకృతినామమునఁ బ్రజ్వరిల్లు శరీరము. దానికిఁ జైతన్యంబిడునది పరమాత్మయని యీ సూక్తము యొక్క ఫలితార్థము.

ఇఁక సూత్రమునందలి జాతి విభజననుగుఱించి.

“ బ్రాహ్మణోస్యముఖమాసీత్, బాహూ రాజన్యఃకృతః।
“ ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగుంశూద్రో అజాయత ”॥

యని 12వ ఋక్కున్నది. దానియర్థము నాకీరీతిఁ దోఁచినది.

సృష్టిలో మానవులెల్లరు నొక్కవిధమగు కర్మమునాచరింపక, భిన్న విధకర్మము లొనర్పసాగిరి. అందునఁ గొందఱు “ ఏమీ మేమెచటవారము? ఎట్లుల జనించితిమి? ఎటులఁ బెర్గితిమి? మాయంత్య మెటులగును? మేమెచటఁ జేరుదుము? అని యెడి విషయము లెల్లకాలములందునుఁ జింతించుచుఁ బారలౌకికము

నందే దృష్టికలవారైరి. పారలౌకిక దృష్టియేలేక, కేవల మైహికానుభవాసక్తులే కొందఱైరి. ఐహికములందు మనము దవిలియుండినను, పారమార్థికమునందుసైత మించుక దృష్టిగలవారు గొందఱైరి " ఇట్టి జనులకు వ్యవహారనామములు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులని యేర్పడెనుగాని వారిలో గౌరవతరతమము లెన్నుటకును గాదు. ఈరీతినిఁ గర్మాసక్తులగుట వారివారి గుణభేదములుకాని జాతిభేదములు గావు. విరాట్పురుషునందుద్భవించిన జనులలో జాతులుండునా? అవి కాలక్రమమున నేర్పడిన సాంఘిక శాసనఫలము. నే నిదివరలోఁబలికిన సాత్విక రాజసతామసగుణ జనితములు పైరీతిగఁ గర్మాను సక్తులగుటకుఁ గారణములు. ఋగ్వేదమునందు "జాతికి" వర్ణమను పర్యాయ నామమున్నదనియు నా వర్ణమనుపేరు ఋగ్వేదమునఁ బలుమారు వచ్చుచున్నదనియు కొందఱందురు. నిజము వర్ణశబ్దము ఋగ్వేదమున నచటనచట నుపయోగింపఁ బడినది. ఏ సందర్భమునః? దస్యులుకారని తెలియఁజేయు విషయమున దస్యులు నల్లనివారు ఆర్యులు బంగారు చాయతోఁగూడిన తెల్లనివారు ఆసందర్భముననుండు నొకఋక్కు నిచటవ్రాసెద:—

M. 3. 34. (9) " మిత్రునిగఱ్ఱములను రక్షించుటకుఁ నింద్రుఁడు గోవులను దెచ్చెను. ధనరాశినార్జించెను. దస్యులనుజంపెను. ఆర్యుల వర్ణమును రక్షించెను ".

7. 64. (2) }
7. 89. (1) } ఈ ఋక్కులలోను మఱికొన్ని ఋక్కులలోను క్షత్రియశబ్దమున్నది. అది దైవమునకు విశేషణ పదముగనున్నది. " శక్తిగల " యనెడు నర్థమిచ్చుచున్నది.

M. 8. 11. (6) ఈ ఋక్కులో "విప్ర" శబ్దము జ్ఞానముగల యని దైవమునకు విశేషణముగ నున్నది.

M. 7. 103. (8) ఈ ఋక్కులోను మఱియు ననేకఋక్కులలో బ్రాహ్మణ శబ్దమున్నది. దీనియర్థము ఋక్కులు రచించినవారని తేట పడుచున్నది.

ఈ సందర్భములోనే, సంస్కృతభాషా ప్రావీణ్యమార్జింపఁ దమయాయు వంతయుఁ గోరు వెట్టినట్టియు పండితులని జగత్ప్రసిద్ధినిఁ గనినట్టియు పాశ్చాత్య పండితులు ముచ్చరిడిన యభిప్రాయ మీక్రిందఁ బొందుపరచెదను.

" ఇన్ని విధముల లిఖితసాక్ష్యము లెదుటనుంచుకొని మనుస్మృతి

యందున్న జాతి నిర్ణయమును నిప్పటి జాతివిధులను వేదయుగమున నుండెనాయని ప్రశ్నించినచో లేదని యొత్తిపలికెదను'', మాక్సముల్లరు.

" ఆదివఱకు జాతిలేదు. జనులందఱు నొక్కతెగవారయి యుండిరి. వారందఱకి "విశ" లని యొక్కనామ ముండెను. " Weber. Indian Literature ".

" చిన్న చిన్న రాజులవద్దఁజేరిన పురోహితుల సంఘము బలమయి పిదప నాకుటుంబమువారు ప్రతివిషయములోను జేరుటవలన గొప్పవారయి పిదప నట్టివారు జాతిగనేర్పడిరి " ( Dr. Roth ).

అన్యజాతివారి యభిప్రాయ మెటులయిన నుండనీ మన గ్రంథములలోనే యీవిషయ మేరీతిగఁ బలుకఁబడినదో చూతము.

వాయు పురాణములోఁ గృతయుగమున జాతినిర్ణయ ముండలేదనియు పిదప వృత్తులనుబట్టి బ్రహ్మ జాతినిర్ణయముఁ జేసెననియునుఁ బలుకఁబడినది. ఆజ్ఞలివ్వ నర్హులైనట్టియు హింసఁజేయు స్వభావము కలిగినట్టియు జనులు క్షత్రియులై యితరులనురక్షింతురు. పక్షపాత మేమియును లేక సత్యమాడుచు వేదముఁ జక్కఁగఁ బఠించువారు బ్రాహ్మణు లనఁబడుదురు. బలహీనులయి వ్యవసాయపనులు సేయువారు వైశ్యు లనఁబడుదురు. సమాచారములు తీసుకొనిపోవువారును స్థళములు శుద్ధిఁజేయువారును శూద్రు లనఁబడుదురు.''

శాంతిపర్వము 188-వ యధ్యాయమున నీ జాతివిషయము ఏవరముగఁ దెలియఁజేయుచు, వృత్తులనుబట్టి యొకజాతివారు మఱియొక జాతివారగుదురని తెలుపఁబడినది. రమేశ్ చందర్ దత్తుగారు " హిందువుల పురాతన నాగరికత " యను గ్రంథములో వేదఋషులనేకులు క్షత్రియవైశ్యులజు లనుటకుఁ బురాణ దృష్టాంతములు జూపినారు.

విష్ణుపురాణము 4, 19 / భాగవతము 9, 20, 6, 7 } వీనిలోఁ గణ్వు డజామీదుని పుత్రుఁడనియును, కణ్వుని పుత్రుఁడు మేధాతిథియనియును బలుకఁబడినది. కణ్వులే ఋగ్వేదములోని నెనిమిదవమండల ఋక్కులు రచించినవారు.

విష్ణు 4, 6, లో " అత్రి " పురూరవుని తాతయని తెలుపఁబడినది. ఐదవమండలములోని ఋక్కులు రచించినది యత్రి.

మత్స్యపురాణం 132, అధ్యాయం } వేదము రచించిన ఋషులలోఁ గొందఱు క్షత్రియులనియు కొందఱు వైశ్యులనియు పలుకఁబడినది.

ఇప్పటివలె నక్కాలంబున జనులలోఁ గొందఱికి వేదాధికారమును నితరులకు వేదపాఠ నిషేధమును నుండినటుల నాకగపడదు. అటు లుండినదే నిజమైనచో జాతివైషమ్యములు పెచ్చుగఁ బెఱుగుచుండెను. ఆర్యులు దస్యులను జయించుచుండలేదు. బ్రాహ్మణుల యధికారము హెచ్చిన బ్రాహ్మణముల కాలమున సైతము జాతికట్టుబా టిప్పటివలె నుండలేదు. ఐతరీయ బ్రాహ్మణమున (7. 29) లో "బ్రాహ్మణభాగపుబలిని క్షత్రియుఁడు తినినయెడల నట్టి క్షత్రియుని సుతునకు బ్రాహ్మణ గుణములు వచ్చును. రెండుమూఁడు జన్మములపిదప బొత్తిగ బ్రాహ్మణుఁడగును. వైశ్యుని భాగము తినినయెడల నట్టివాని సుతునకు వైశ్యుని గుణములు వచ్చును రెండుమూఁడు జన్మములపిదప వైశ్యుఁడగును" అని చెప్పఁబడినది. మూఢాచారములు ముదిరిన బ్రాహ్మణుల కాలమున సైతము బ్రహ్మక్షత్రియ వైశ్యులను మూఁడుజాతులవారును యాగబలి భాగార్హులయి యుండిరి. అట్టివారికి వేదాధికార మక్కాలమున నుండెననుటకు సందియంబులేదు. విదేహదేశపు రాజు జనకుఁడు, యాజ్ఞవల్క్యమునికిఁ దెలియని వేదాంతవిషయములుగొన్ని బోధించిన కారణంబున బ్రాహ్మణుఁడయ్యెనని శతపద బ్రాహ్మణములో ( 11. 6. 2. 1 )లోఁ జెప్పఁబడినది. పుట్టుకపైన బ్రాహ్మణుఁడు కాఁడనియు బ్రహ్మజ్ఞాన మార్జించుటవలననే బ్రాహ్మణుఁడగుననియు పైఁ బ్రమాణము స్థాపించును. ఇట్టి గొప్పప్రమాణముల నొక్కతూరి వాదసాధకములుగను నొక్కతూరి వాద బాధకములుగను ననుకూలములకొలఁది యర్థంబు సేయుట న్యాయవాదంబు కాదు

ఐతరీయబ్రాహ్మణము 2. 19. లో నీ క్రిందికథ వ్రాయఁబడినది.

"ఇలూషా సుతుఁడు కవేషా యనువాఁ డొక యజ్ఞమునకుఁ బోవ నచ్చట బ్రాహ్మణులు వానిని దాసీపుత్రుఁడనియు జూదరియనియు నిందించి యజ్ఞశాలనుండి వెలికిఁద్రోసిరి. అయిన బాహ్యాచర్యలలో నెట్టివాఁడయినను కవేషా బ్రహ్మజ్ఞాని. దైవముల నెఱింగినవాఁడు, దైవములకు వానినిఁ దెలుసును. బ్రాహ్మణులీ విషయము పిదపఁ గొన్నికారణంబులచే నెఱింగి వాఁడు బ్రాహ్మణుఁడని యాగమునకు రానిచ్చిరి." ఈ కథ ఋగ్వేదములోసైత మున్నది. శూద్రుఁడయినను బ్రహ్మజ్ఞానిగ నుండిన కారణంబునఁ గవేషా బ్రాహ్మణుఁడయ్యెను. పుట్టుకచే నెట్టివాఁడయినను బ్రహ్మజ్ఞాన మార్జించుటచే బ్రాహ్మణుఁడగునని యీ కథయు స్థాపించుచున్నది.

ఛాందోగ్యోప నిషత్ 4. 4. } లో సత్యకామ జాబాలుని చరిత్ర మతివిచిత్రముగ నున్నది. ఇది సత్యజ్ఞానములు, మనుజునకు గౌరవముఁ దెచ్చుటయగాక మతాఁ

వృత్త్యము దెచ్చునని నిర్ధరించును. ఆ కథ యీరీతిగనున్నది.

జాబాలియను స్త్రీ సుతుఁడు సత్యకామ, తనతల్లిని సమీపించి "అమ్మా! నేను బ్రహ్మచారినయ్యెద. నా కులగోత్రములు తెలుపుమని యడిగెను"

పుత్రా! నీవేకుటుంబమునకుఁ జేరినవాఁడవో నాకుఁ దెలియదు. నా వయసునందు చటనవట దాసీకార్యములు నిర్వహించుచు నినుఁగంటిని. నాపేరు జాబాలి నీ పేరు సత్యకాముఁడు. కావున సత్యకామ జాబాలియని తెలుపుమని తల్లి బదులిడెను.

పిదప సత్యకాముఁడు, గౌతమ హారిద్రుమ వద్దకుఁబోయి "స్వామీ మీసరస శుశ్రూష సేయుచు బ్రహ్మచారి కాఁగోరెద. నే నటులుందునా?"

మిత్రమా! నీవే కుటుంబమునకుఁ జేరినవాఁడవు?

స్వామీ! నాకది తెలియదు, నా తల్లిని నే నడిగితిని. "చిన్నతనమున దాసిగ సంచరించునపుడు నేను నిన్నుఁగంటిని నీవేకుటుంబమునకుఁ జేరినవాఁడవో నాకుఁదెలియదు నాపేరు జాబాలి నీపేరు సత్యకామ" అని నా తల్లి బదులిడెను కావున నాపేరు సత్యకామ జాబాలి"

బ్రాహ్మణుఁడు తప్ప నింతగ సత్యమాడువాఁడెవఁడుండడని ఋషిపలికి మిత్రమా! నీవు సత్యమునకు విరుద్ధముపలుకవు. కావున నీకు బ్రహ్మచర్యాశ్రమ మిచ్చెద. పోయి కట్టెలు తీసికొనిరమ్ము.

సత్యసంధుఁడగు నీబాలుని బ్రహ్మచారినిఁ జేసెను. అప్పటికాలపు బద్ధతిరీతి సత్యకాముఁడు గురువులపశువులను మేపఁ దీసికొనిపోయెను. కొన్ని దినములకు సృష్టిమహిములు దాని రహస్యములును, పశుమృగజాతి రహస్యములునుఁ జక్కఁగఁ దెలిసికొనెను. ఈ రీతిని సర్వముఁదెలిసి గురువులవారిని సమీపించెను. గురువులవారు వానిఁజూచి మిత్రమా! బ్రహ్మమెఱింగిన వానికిఁగల వర్చస్సు నీయందుఁగలిగినది. నీ కెవరుపదేశించిరి?

మానవులు నాకుపదేశింపలేదని సత్యకామజాబాలి పలికెను."

పై కథనుండి జాబాలిబ్రాహ్మణ స్త్రీ కాదనియు దాసియనియు వ్యభిచారిణియనియు తెలియవచ్చుచున్నది. అట్టిదాని సుతుఁడు చాండాలుఁడుగాక బ్రహ్మోపదేశమందిన బ్రాహ్మణుఁడయ్యెను ఇచటిసత్యమునుండి బ్రాహ్మణుఁడు కానగునని తెలుపఁబడినది. బ్రాహ్మణముల కాలమునందేమి, యుపనిషత్తుల కాలమునందేమి యిప్పటివలె జాతికట్టుబాటు లుండలేదనుట నిస్సందేహము. ఋగ్వేద

యుగమునందే మంత్రములు పఠించువారు తత్పరతనమేక జీవనవృత్తిగ నుంచికొని యుండినటులను ప్రస్తుత కాలమందున్న జాతికట్టుబా టప్పటికాలమున నుండ లేదనియు తెలియఁజేయు ఋక్కులున్నవి. ఈక్రింద వ్రాసినాను.

M. 9. 112. (1) మనకు ననేకములగు తలంపులుకలవు. పనులొనరించు క్రమములుగలవు. మానవమార్గము లనేకములు. బ్రాహ్మణులు యాగమొనరించు యజమానుని వెదకుదురు. వస్తువులుఁ జక్కఁబెట్టువారు చీలినవస్తువు లెవరివద్దనున్నవియో యని చూచుచుందురు. వైద్యుఁడంగహీనుని వెదకుచుండును.

(2) కమ్మరకమసల పనులుసేయువాఁడు సామగ్రిసహితులయి పక్షుల యీఁకలు, రాళ్లు, వహ్నిపాత్ర మొదలగుసాధనలను సిద్ధపఱచుకొని బంగారున్నవానిని వెదకుచుండెను.

(3) నేను మంత్రములు రచించుఋషిని, నాతండ్రి వైద్యుఁడు, నాతల్లి పిండివిసరి పనిచేయునది. ధనమార్జించుటకు ననేకములగు యుక్తులుపన్ని గోవులబలె మా యిష్టానుసారము మేము పనిఁ జేయుదుము.

(4) బరువులేనిబండిని గుఱ్ఱమీడ్చును. వినోదముగోరు యజమానుఁడు నవ్వించు విదూషకులనుగోరును. పురుషుఁడు తనస్త్రీరాకఁ గోరును. కప్ప ప్రవాహముగోరును.

ఒక కుటుంబమునకుఁ జేరినవారు తమ యిష్టానుసార మేవృత్తియయిన నవలంబింపనగునని స్థాపించునుగాని ఒకజాతివాఁడాజాతికి నర్హమగు కర్మమే యొనరింపవలెనను విధులుండలేదు. పై సూక్తము స్పష్టముగనున్నది.

మనుస్మృతి (1.31) యాజ్ఞవల్క్య (3.) } ఇఁక బ్రాహ్మణోద్భవ మూలకారణము మనుస్మృతిలోను యాజ్ఞవల్క్య స్మృతిలోను నీక్రింద వివరించినరీతిగఁ బలుకఁబడినది.

"వేదము పఠించుటకునుఁ బఠింపఁజేయుటకును బ్రహ్మ తన ముఖము నుండి యొకపుత్రునిఁ బుట్టించి వానికి బ్రాహ్మణుఁడని పేరిడెను. అడవిమృగముల నుండి కలుగుబాధలుఁ దప్పింపఁ దనబాహులనుండి యొక సుతునిఁబుట్టించి వానికి క్షత్రియుఁడని పేరుఁబెట్టెనఁట. ఆ యిరువురినిఁ బోషించుటకు వైశ్యునిఁ బుట్టించెనఁట. పై ముగ్గురిచేతిక్రిందఁ బనులుసేయుటకును శూద్రునిఁ బుట్టించెనఁట." ఈ విష

యమునుగుఱించి మూయర్ అను పాశ్చాత్యపండితుఁడు తన ( Sanscrit texts Vol. I. 160 ) లో విశేషముగ వ్రాసినాఁడు. దానినిఁ జూడనగును.

ఆర్యులలోఁ గల కట్టుబాటులు లేకయున్నను నితర దేశములందు సైతము హిందూజాతివిభజనకు సమానమగు జాతివిభజన మున్నదని వ్రాయుచు, జనులలోఁ దరగతుల తారతమ్యముపుట్టుట కాంగ్లేయదేశ దృష్టాంతమునుఁ దీసికొని రమేశచందర్ దత్తుగారు తమ ( Civilization in Ancient India ) యను గ్రంథములో 153 పుటయందు జక్కఁగ వ్రాసినారు. గుణమునుబట్టి యొకజాతివాఁడు వేఱొకజాతికి మారనగునని నే నిదివరకే వ్రాసినాను. కవేషాయను దాసీపుత్రుఁడు బ్రాహ్మణుఁడయినకథను దెలిపినాను. శతపద బ్రాహ్మణములోనే మఱియొక గాథయున్నది. దానినిచట వ్రాసెదను.

శతపద బ్రాహ్మణము. 11.6.2.1. — విదేహపురిరాజగు జనకునిసరసకు నలుగురు బ్రాహ్మణులు వచ్చిరి (1) శ్వేతకేతు, (2) సోమసుశుష్మ; (3) సత్యయాజ్ఞ్య, (4) యాజ్ఞవల్క్యయని వారినామములు. జనకుఁడు వారినిఁ జూచి " మీ రెటు లగ్నిహోత్ర మొనర్తురని యడిగెను. దానికిసదుత్తర మెవ్వరునివ్వజాలరైరి. యాజ్ఞవల్క్యమాత్ర ముత్తరమిచ్చెను గాని యది తృప్తికరముగ నుండలేదు కావున జనకుఁడు రథమునెక్కి వెళ్లిపోయెను. బ్రాహ్మణులదిగని యారాజీనిగర్వమని ప్రల్లదములు పలుకసాగిరి. యాజ్ఞవల్క్యమాత్రము తనరథముపైనెక్కి రాజుసరసకుఁబోయి జనకునిచే బోధింపఁబడెను. క్షత్రియుఁడగు జనకుఁడు బ్రాహ్మణుఁడయ్యెను.

చాందోగ్యోపనిషత్తు 5. 3. లో నీరీతి పలుకఁబడినది.

" శ్వేతకేతు ప్రవాహాన జైబాలియను రాజువద్దకుఁ బోయెను. రాజతనిం జూచి యైదుప్రశ్న లడిగెను. ఒక్కప్రశ్నకైనను బ్రాహ్మణుఁ డుత్తర మివ్వఁజాలక తనతండ్రియగు గౌతమున కవ్వార్తఁ దెలిపెను. గౌతమునకును సదుత్తరము దోఁపక జైబాలివద్దకుఁ బోయెను. జైబాలి గౌతమా! ఈ విద్య బ్రాహ్మణుల స్వతంత్రమగు సొమ్ముకాదనిపలికి సదుత్తరములు చెప్పెను. ఇందులోనే పైరాజిరువురి గర్వోక్తులకుఁ బుద్ధిఁగల్పించి వారికి వేదాంతబోధన సేసెనని పలుకంబడినది.

చాందోగ్యోపనిషత్తు 5. 11 — లో " అయిదుగురు బ్రాహ్మణులు వేదాంతులు దైవవిషయమున నాత్మవిషయమును దెలియఁగోరి యశ్వపతి కైకేయవద్దకు, శిష్యుల

పూర్వయుగములందారీతిగ నుండిన వారిని పునస్సృష్టిలోఁ బైనఁ జెలికినరీతి పురు షుఁడు తనయవయవములనుండి పుట్టించెనని యర్థముండునా? అటులయిన వారి వారి కర్మానుసారము వారుపుట్టిరని యర్థమగునుగాని పురుషునకుఁగాని దైవ ములకుఁగాని కర్తృత్వంబు తప్పిపోవును. కావున నీ సూక్తమునందు నంతరార్థము వేఱొకటియున్నదని నా యభిప్రాయము.

" బ్రాహ్మణోస్యముఖమాసీత్ " యను వాక్యములోఁ బురుషుని ముఖమునుండి బ్రాహ్మణులు వచ్చిరనియా? గాక బ్రాహ్మణులు పురుషుని ముఖ మయిరని యర్థమా? ఇటులనే మిగత మూఁడుజాతులును పురుషుని యంగముల నుండి పుట్టిరనియా! గాక వానియంగము లైరనియా? తెలియకయున్నది.

అశ్వమేధ యాగములో బల్యశ్వము యముఁడనియును, దాసితల ప్రాతఃకాలమనియు కన్ను సూర్యుఁడనియు శ్వాసోచ్ఛ్వాసములు గాలియనియు చంద్రుఁడు చెవులనియు పలుకఁబడినది. అటులనే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు పురుషుని యంగములైరని యర్థము సేయుటకు మార్గమున్నది. భారతారణ్య పర్వ ములో 12962-వ శ్లోకమీ యర్థమే నిర్ధరించుచున్నది.

పురుషసూక్తములో దైవములచే పురుషమేధ మొనర్పఁబడెనని యున్నది గాని యే దైవమునుగురించి బలులిచ్చిరనునది తెలుపఁబడలేదు.

పైఁ గారణములవలన జాతివిభజన మెపుడయినదియు యెందులకై యాయినదియు తెలియరాదు.

(2) తైత్తరీయ సంహితయందు జాతివిభజన మీక్రింద వివరించినరీతిగఁ బలు కఁబడినది.

" ప్రజాపతి, సృష్టింప నిశ్చయించి ముఖముతోఁ ద్రివృత్తస్తోమ మొనర్ప నందుండి యగ్నియును, గాయత్రియు, రథాంతసామము, బ్రాహ్మణులును, మేఁక యును బుట్టెను. భుజములనుండి పంచాదశస్తోమ మొనర్ప నింద్రుఁడును త్రిష్టు ప్పును బృహాత్సామమును రాజన్యులును గొఱ్ఱెలున్ను బుట్టిరి. నడుమునుండి సప్తదాసస్తోమ మొనరింప విశ్వేదేవులును, జగతీ, చందస్సును విరూపసామ మును వైశ్యులును గోవులును బుట్టిరి. పాదములనుండి వింశస్తోమ మొనరింప అనుష్టుప్ చందస్సును విరాజనామమును శూద్రులును గుఱ్ఱములును పుట్టెను. దైవము లెవరును బుట్టలేరి. కావున శూద్రులకు నాగమవిధులకు నర్హతలేక పోయెను "

బ్రాహ్మణముల కాలమున నీ జాతినిర్బంధములు హెచ్చాయెను. విధులేర్పడెను. గౌరవ తారతమ్యములు బలమాయెను సంఘమునందు వైషమ్యములు పెచ్చుపెఱిగెను. సంఘైకమత్యము చెడెను. అనేకులు బౌద్ధులు జైనులగుటకుఁగల కారణములలో నార్యుల జాతినిబంధనయొకటి. ఋగ్వేదమునకు బహుకాలానంతరమున నీ జాతినిర్బంధమునకుఁగల రహస్యమునుఁ దెలియఁజాలక జనులయందు భేదబుద్ధులు విశేషముగఁగలిగెను. రాజులు తమప్రజలను దయారహితులై హింసింపసాగిరి. ప్రజానురాగంబు రాజులందు దినక్రమేణ క్షీణింపసాగెను. సంఘాభిమానము దేశాభిమానము మాసిపోయెను. ఆర్యుల ఘనత నీఱుఁగలసెను. జాతివిభజనయొక్క రహస్యమును మఱచుటచే దేశములో ననర్థములు గలుగుటకుఁ గారణములయ్యెను. జాతివిభజనలయినను బ్రహ్మ క్షత్రియ వైశ్యులుత్తమజాతికిఁ జేరినవారని యెన్నఁబడిన కారణంబున వారెల్లరకు బ్రహ్మోపదేశముండెను. యజ్ఞములొనర్చుచుండిరి.

"నాగ్నిర్నయజ్ఞోనక్రియానసంస్కారోనవ్రతాని శూద్రస్య। ఉత్తమస్త్రీణాంతు నశూద్రవత్" అని యున్నది. శూద్రులకు నగ్నికర్మములుగాని యజ్ఞక్రియాదులుగాని సంస్కారములుగాని వ్రతములుగాని లేవు. ఉత్తమజాతికిఁ జేరిన స్త్రీలు శూద్రులబలెఁ గారని యిందులతాత్పర్యము. ఉత్తమజాతికిఁజేరిన పురుషులనఁగా బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతి పురుషులకు యజ్ఞయాగాది కర్మము లొనరించు నధికారమున్నదని స్పష్టమైనది. బ్రహ్మోపదేశము వేదాధ్యయనము వారికెప్పుడునుగలవనికదా యర్థము. ఇటులుండ వైశ్యులకు వేదకర్మములేదని వాదింపనేల? క్షత్రియజాతి యెప్పుడో క్షీణించెను. ఉత్తమజాతులలో హతశేషులమై బ్రాహ్మణులు వైశ్యులు నిలిచినారు. ఇటు నిలిచినవారిలో జాతివైషమ్యములు పుట్టుట సమంజసముగాదు. వీరు వైశ్యులుకారని యొకపండితుఁడు వ్రాసెను. పరశురామాహుతికి క్షత్రియులు బలియయినట్లు వైశ్యులెవు డేమహాపురుషుని లోచనవహ్నికి లోఁబడి క్షీణించిరో తెలియదు. "బ్రాహ్మణక్షత్రియో వైశ్యాత్రయో వర్ణాద్విజాతయః" అని స్పష్టముగ నున్నది. పైన నాచే వ్రాయఁబడిన పురుషసూక్తము నవీనమనుటకును జాతివిభజనయయిన పిదప నీ సూక్తము పుట్టినదనుటకును గొన్నికారణములును జూపుచు వానికిఁగల ప్రమాణములనువ్రాసి దానినిగుఱించి చర్చించెద.

బ్రాహ్మణోస్యముఖమాసీత్।
బాహూరాజన్యఃకృతా।

ఊరూతదస్య యద్వైశ్యః।
పద్భ్యాగుంశూద్రోయజాయతా ॥

ఈ భాషయును వేదభాషయును నించుక సంస్కృతమువచ్చినవారు నిష్పక్షపాతబుద్ధినిఁ బరిశీలించినచోఁ బురుషసూక్తభాష నవీనమని తెలుపుటకు నే సందియమును లేదు. ఈ భాషపాణిని సంబంధసంస్కృత భాషగనున్నది. మన పురాణభాషలను బోలుచున్నది.

ఈ ఋక్కునందుపయుక్తమయిన బ్రాహ్మణ వైశ్య శబ్దముల రూపములు ఋగ్వేదములో మఱియెచటను గానరావు. అనేకఋక్కులలో "బ్రహ్మన్" "విశః" యను శబ్దరూపములే యున్నవి. ఇఁక నీ ఋక్కునందు వసంత గ్రీష్మ శరత్శబ్దములు ఋతువుల నామములుగనున్నవి. ఋగ్వేదమెంత వెదకినను నీశబ్దములు మఱియెచటను గానరావు. మధు మాధవ శుక్ర శుచి, నభ నభస్య యని యాఱు ఋతువుల పేళ్లు నచటనచట వచ్చుచున్నవిగాని యిపుడు రూఢిలో నుండురీతిగ వసంతాది నామములులేవు కావున పైసూక్తము నూతనమని నిస్సందేహముగఁ బలుకనగును.

జాతినిర్ణయ మిచట నుండినరీతిగ ఋగ్వేదమున మఱియేఋక్కునను లేదు.

ఋగ్వేదమునుండి యనేకఋక్కులు సామవేదమునఁ జేర్పఁ బడినవి. పురుషసూక్త మంతటి ముఖ్యమగు ఋక్కు సామవేదమునఁ బలుకఁబడలేదు.

ఆర్యులు పంజాబుచేరి దస్యులను జయించి జయించినవారిని నార్యులుగఁ జేర్చుకొనినపిదపనే యీ సూక్తము పుట్టియుండనగును.

ఊరూతదస్యయద్వైశ్యః ॥ అని పురుష సూక్తముననున్నది. ఇదే సూక్తమే యథర్వవేదములోనున్నది. అందు "మధ్యంతదస్య యద్వైశ్యః" అని పాఠభేదమున్నది.

ఆర్యులు కాశ్మీరమును పంజాబును జేరకముందే ద్రావిడులు దక్షిణ దేశము నిండియుండిరి. పురుషసూక్తములోఁ బలుకంబడిన మానవ సృష్టిలోను, వారి జాతి విభజనలోను ద్రావిడుల విషయము పలుకఁబడలేదు. పురుషమేధ మార్యావర్తములోని మానవసృష్టికేనా యన్వయించునది?

దైవములు పురుషమేధ మొనర్చునపుడే, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నామములుండెనా? ఆ విభజనలుండెనా? ఉండినచో సృష్టికిఁ గారణంబేమి?

పూర్వయుగములందారీతిగ నుండిన వారిని పునస్సృష్టిలోఁ బైనఁ బలికినరీతి పురుషుఁడు తనయవయవములనుండి పుట్టించెనని యర్థముండునా? అటులయిన వారి వారి కర్మానుసారము వారుపుట్టిరని యర్థమగునుగాని పురుషునకుఁగాని దైవములకుఁగాని కర్తృత్వంబు తప్పిపోవును. కావున నీ సూక్తమునందు నంతరార్థము వేఱొకటియున్నదని నా యభిప్రాయము.

" బ్రాహ్మణోస్యముఖమాసీత్ " యను వాక్యములోఁ బురుషుని ముఖమునుండి బ్రాహ్మణులు వచ్చిరనియా? గాక బ్రాహ్మణులు పురుషుని ముఖమయిరని యర్థమా? ఇటులనే మిగత మూఁడుజాతులును పురుషుని యంగముల నుండి పుట్టిరనియా? గాక వానియంగము లైరనియా? తెలియకయున్నది.

అశ్వమేధ యాగములో బల్యశ్వము యముఁడనియును, దాసితల ప్రాతఃకాలమనియు కన్ను సూర్యుఁడనియు శ్వాసోచ్ఛ్వాసములు గాలియనియు చంద్రుఁడు చెవులనియు పలుకఁబడినది. అటులనే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు పురుషుని యంగములైరని యర్థము సేయుటకు మార్గమున్నది. భారతారణ్య పర్వములో 12962-వ శ్లోకమీ యర్థమే నిర్ధరించుచున్నది.

పురుషసూక్తములో దైవములచే పురుషమేధ మొనర్పఁబడెనని యున్నది గాని యే దైవమునుగుఱించి బలులిచ్చిరనునది తెలుపఁబడలేదు.

పైఁ గారణములవలన జాతివిభజన మెపుడయినదియు యెందులకై యయినదియు తెలియరాదు.

(2) తైత్తరీయ సంహితయందు జాతివిభజన మీక్రింద వివరించినరీతిగఁ బలుకఁబడినది.

" ప్రజాపతి, సృష్టింప నిచ్ఛయించి ముఖముతోఁ ద్రివృత్తస్తోమ మొనర్ప నందుండి యగ్నియును, గాయత్రియు, రథాంతసామము, బ్రాహ్మణులును, మేఁకయును బుట్టెను. భుజములనుండి పంచాదశస్తోమ మొనర్ప నింద్రుఁడును త్రిష్టుప్పును బృహత్సామమును రాజన్యులును గొఱ్ఱెలున్ను బుట్టిరి. నడుమునుండి సప్తదాసస్తోమ మొనరింప విశ్వేదేవులును, జగతీ, చందస్సును విరూపసామమును వైశ్యులును గోవులును బుట్టిరి. పాదములనుండి వింశస్తోమ మొనరింప అనుష్టుప్ చందస్సును విరాజసామమును శూద్రులును గుఱ్ఱములును పుట్టెను. దైవము లెవరును బుట్టలేరి. కావున శూద్రులకు నాగమవిధులకు నర్హతలేక పోయెను."

పురుషసూక్తమునకును తైత్తరీయ సంహితకును నీ జాతివిషయముఁగల భేదములు చదువరులు పోల్చికొందురని యప్పటికి నేను బూననైతిని.

శతపథ బ్రాహ్మణములోఁ బ్రజాపతి "భూ" యనెడి నక్షర ముచ్చరించినతోడనె బ్రాహ్మణుఁడును "భువ" యనినతోడనె క్షత్రియుఁడును "స్వ" యనినతోడనె వైశ్యుఁడును బుట్టిరని యున్నది. ఈ భేదమునకుఁ గారణమేమో తెలియదు.

తైత్తరీయ బ్రాహ్మణములోఁ బుగ్వేదమునుండి వైశ్యులు వచ్చిరనియు యజుర్వేదమునుండి క్షత్రియులు వచ్చిరనియు సామవేదమునుండి బ్రాహ్మణులు వచ్చిరనియు తెలుపఁబడినది. ఈ భేదమెందుకుఁగలిగెనో?

వాయుపురాణము 9.వ యాశ్వాసములో నీ జాతివిభజన మీరీతిగఁ బలుకఁబడినది.

బ్రహ్మ జగత్తును సృష్టించెను. పిదప నందు నాహారములెల్ల నించెను. అటులొనరించిన పిదప మానవులనుఁ జూచి వారేవృత్తు లనుసరింపఁదగిన వారను నదియు వారికి నేవృత్తియందాసక్తి గలదనునదియు గుర్తించి సత్యవంతులయి క్రమముగ జ్ఞానమార్జించినవారిని బ్రాహ్మణులుగఁ జేసెను. భుజశక్తిగలిగి క్షాత్రవ సంహారాసక్తికలవారిని క్షత్రియులుగఁ జేసెను. ధైర్యశౌర్యములు తక్కువయి కృషి వాణిజ్యాది కర్మాసక్తులను వైశ్యులుగ నొనర్చెను. సేవకావృత్తియం దాసక్తికల వారిని శూద్రులుగఁ జేసెను. జాతివిభజనము పైరీతిగ నయినదని పలుకఁబడినది. వాయుపురాణ గ్రంథకర్తకుఁ బైఁ బురుషసూక్తము తెలియదని పలుకనగునా? తెలిసియు జాతివిభజనము పైరీతిగ నయ్యెనని పలికెనేల? వాయుపురాణానంతరమే, పురుషసూక్తము వ్రాయఁబడినదియా? ఈ యంశములు చదువరు లూహింప వలయును.

రామాయణములోఁ గశ్యపునిభార్య "మను" అనెడు స్త్రీ, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను గనెనని పలుకంబడినది.

"మనుర్మనుష్యాన్ జనయత్, కశ్యపస్యమహాత్మనః।
"బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్, శూద్రాంశ్చమనుజర్షభా॥

కశ్యపునిభార్య మను వనునది ప్రారంభముననే, జాతిని నిర్ధరించుకొని సుతులనుగనెనా? అటుగాక పుట్టినకొడుకుల గుణములఁజూచి పైరీతిగ జాతివిభజన మొనర్చెనా యనెడి అంశమును దెలుపలేదు. అయిన నీసృష్టి పురుషసూక్తమునకు విరుద్ధముగనున్నది.

భారతములో నాద్యరణ్యోద్యోగ శాంత్యను శాసనిక పర్వములలో జాతుల పుట్టుకవిషయమును వర్ణాశ్రమ ధర్మములనుగుఱించియు నచటనచట విశేషముగఁ బలుకంబడినది గాని యవి పరస్పర విరుద్ధములతోఁ బెనఁగులాడు చున్నవి. ఎటునిర్ధరించుటకును దోఁపక యిష్టానుసార మూహించినటులున్నది. వానినెల్లను వ్రాసిచూపుటకుఁ గాలంబుగాదిది. అయినను భృగుభరద్వాజుల ప్రశ్నోత్తరములు సూక్ష్మముగ వ్రాసెదను. వలయువారు శాంతిపర్వములో 6910వ శ్లోకమునుండి 6960-వ శ్లోకమువఱకుఁ జదివి సంపూర్ణముగ నీ విషయముఁ దెలిసి కొననగును.

భరద్వాజ ఋషిచే నడగంబడిన ప్రశ్నకు భృగుఋషి యీరీతిగ బదులిడెను.

భరద్వాజా:— బ్రహ్మ, స్వశక్తిచే సూర్యాగ్నుల ప్రకాశముగలిగి వెలయు ప్రజాపతినిఁ బుట్టించెను. మఱల సత్యము, ధర్మము, తపస్సు శాశ్వతమగు జ్ఞానము (వేదము) పుణ్యకర్మము, శుద్ధమానసము కలిగించెను. పిదప, దేవతలను, దానవులను, గంధర్వులను, దైవములను, అసురులును మహోరగములను, యక్షులను, రాక్షసులను, నాగులను పిశాచములను బుట్టించెను. మఱల బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను బుట్టించెను. బ్రాహ్మణవర్ణము తెల్లగనుండును, క్షత్రియవర్ణ మెఱ్ఱగనుండును. వైశ్యులవర్ణము నలుపుతోఁగూడిన పచ్చగనుండును శూద్రులవర్ణము నల్లగనుండును. పై మాటలువిని భరద్వాజముని తృప్తిపడక మఱలఁ బశ్నించినదేమన స్వామీ! రంగులపైన జాతు లేర్పడినయెడల ననేకా నర్థములకుఁ గారణ మగునుగదా! కామక్రోధాది దుర్గుణములు సర్వులకు సామాన్య లక్షణములు. క్షుత్పిపాసాదిబాధలు సర్వజన సామాన్యములు, మరణ మెల్లరకు నున్నది. ఒక్కజాతిలోనే వర్ణభేదము లనేకములుండును. ఎటు జాతుల నిర్ధరింప వలెనని ప్రశ్నించెను. దానికి భృగుఋషి పలికినదేమనఁగా:—

భరద్వాజా! జాతులలో భేదమేమియు లేదు. బ్రహ్మసృష్టి ప్రారంభమున సర్వులను బ్రాహ్మణులుగనే సృష్టించెను. పిదప వారు తామొనరించు కర్మములను బట్టి జాతిభేదము లేర్పడెను. బ్రాహ్మణులు సర్వకాలములందును గామ సుఖలోలు రయి, క్రోధావేశపరులయి, విధ్యుక్తకర్మము లాచరింపక యున్నందున క్షత్రియులైరి. బ్రాహ్మణులు పశుపులవ్యాపార మొనర్చుచుఁ గృషివాణిజ్యములు సేయుచు విధాయకకర్మములు వదలుటచే వైశ్యులైరి. బ్రాహ్మణు లెల్లకాలమునం దసత్యము లాడుచు, హింసకర్మములొనర్చుచు విధాయకకర్మములను బొత్తిగ మఱచినవారు

శూద్రులైరి. ఈరీతినిఁ గర్మభేదములచే బ్రాహ్మణులలో జాతిభేదములు గలిగెను గాని యాగయజ్ఞకర్మాచరణము లెవరికిని నిషేధింపఁబడలేదు. తమకు విధింపఁబడిన వేదోక్తకర్మములను వదలినవారు బ్రాహ్మణులు కారు. ఎవఁడు శుద్ధమానసముఁగలిగి విద్యుక్తాచారము లొనర్చుచు, షట్కర్మనిరతుఁడై సత్యముఁబల్కుచు నుండునో వాఁడు బ్రాహ్మణుఁడగును.

చూచితిరే బ్రాహ్మణుఁ డుండఁదగినవిధులు తప్పినచో వానికేఁగలుగు ముప్పులు. పుట్టుకతోనే బ్రాహ్మణత్వము వచ్చునను వచనమున్ను "బ్రాహ్మణో జాయతేనమః" యను నుడియును మిథ్యలు. బ్రహ్మజ్ఞానముగలవాఁడు బ్రాహ్మణుఁ డనునది సత్యము.

పైనవ్రాసిన ప్రశ్నోత్తరములలో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రుల వర్ణములు నిర్ధరింపఁబడినవి. ఆ వర్ణమునకు వర్చస్సనిసైతము పేరు. ఈ వర్చస్సునే యాంగ్లేయు లారా (Aura) యని పిలుచుచున్నారు. ప్రతి మనుజునందునుండియు వానికిఁగల సాత్త్విక, రాజస, తామసగుణ ప్రాధాన్యమునుబట్టి వాని చుట్టును నొకవిధమగువర్చస్సు (కాంతి) వ్యాపించియుండును సాత్త్వికగుణమునుండి తెల్లని కాంతియు రాజసమునుండి యెఱ్ఱని కాంతియుఁ దామసమునుండి నల్లని కాంతియు వెడలుచుండును. జ్ఞానులు దీనిని గుర్తింపఁగలరు. ఈరీతిగ వెలివడు వర్చస్సునకును జాతులకును సంబంధములేదు. శూద్రుఁడు సాత్త్వికగుణ ప్రాధాన్యుఁడయి యుండెనేని వానివర్చస్సు తెల్లఁగనుండును. మేనిచాయకును వర్చస్సునకును నేలాటి సంబంధమును లేదు.

సాత్త్వికగుణమున బ్రహ్మజ్ఞానమార్జించి బ్రాహ్మణత్వమునంది ఋగ్వేద ఋక్కులు రచించిన క్షత్రియులే, మను, విశ్వామిత్ర, వివశ్వత, యిడ, పురూర్వసులు. అదేరీతిగ బ్రహ్మజ్ఞానమార్జించి సూక్తములు రచించిన వైశ్యులే భలాంద, వాంద్య, సంకీర్తి యనువారు; వారువారాచరించిన పుణ్యకర్మములనుండి శూద్రుఁడు బ్రాహ్మణుఁడయిన విధమును దుష్కర్మములనుండి బ్రాహ్మణుఁడు శూద్రుఁడయిన విధమును పురాణములు తెలుపుచున్నవి వానినిఁ జూడనగును. ప్రతిపురాణములోను నీ జాతివిషయము పలుకఁబడినదిగాని యొకటికి మఱియొకటి విరుద్ధముగనున్నది. ఋషులు తమతమ యిష్టానుసార మూహించి తమకుఁ దోఁచినది వ్రాసినారు.

ఇఁక నార్యుల మూలపురుషుఁడు మనువని ఋగ్వేదములో నీ క్రింద వివరించిన ఋక్కులున్నవి.

1. 80. 16; 1. 114. 2, 2. 33. 13; 8. 52. 1; 10. 100. 5;
8. 30. 3; 1. 68. 4; 3. 3. 6; 4 37. 1; 6. 14. 2; 8. 23. 13;

మానవులందఱు మనువు సుతులైనచో నందఱును మనువు వంశీకులు గను మనువు జాతికిఁ జేరినవారుగ నుండవలెను. జాతిభేదించుటకు హేతువులేదు. కావున గుణభేదములనుండియు వృత్తిభేదములనుండియు జాతిభేదములు కలిగిన వనుటకు సందియము లేదు.

ఐరాణాల జన్దవస్థలోను “అథర్వ, రథేష్ట, వస్త్రియ, యను జాతులున్న వనియు హిందువులకుం బలెనిర్బంధములు లేవనియు తెలియవచ్చుచున్నది.

యూరోపు జాతివారిలోను జాతివిభజనలున్నను మనవలెఁ గట్టు బాట్లులేవు.

ఇఁకఁ బైన వ్రాయఁబడిన పురుషసూక్త ఋక్కునుండి నాకుఁదోఁచిన యభిప్రాయ మీదిగున వ్రాసినాను. ముఖము వాక్స్థానము భుజములు శక్తిస్థాన ములు తొడలు కష్టపడునవి. పాదములు నడుచునవి. దీనినుండి మనమూహింపఁ దగిన దేమన —

సృష్టింపఁబడిన మానవులెల్లరును దమతమ యిష్టానుసారముగఁ గార్యము లొనర్చుచుండిరి. ఐహిక సుఖములను సరకుసేయక దైవము స్తుతించుచుఁ గేవల పారలౌకిక విషయమునందాసక్తులై సదాకాలము బ్రహ్మమును స్మరించుచుండు వారు బ్రాహ్మణులని పేరందిరి. భుజశక్తిచే నందఱికిని భీతిఁగలిగించుచుఁ బార లౌకికమునందు సైతము దృష్టికలవారు క్షత్రియులని పేరందిరి. కష్టమునకు నోర్చుచుఁ గృషివాణిజ్య కర్మము లొనర్చుచుఁ బారలౌకికమునందించుక దృష్టికలవారు వైశ్యు లని పేరందిరి. కేవలముగ నైహికమునందే దృష్టియుంచి పారలౌకిక విషయము తెలియనివారు శూద్రులైరి. వీరు జ్ఞానమున హెచ్చుజాతికిఁ జేరనగును.

మహాశయులారా! ఇపుడు మనముండునది తర్కశాస్త్రకాలము. ప్రతి యొక విషయమును గుఱించియు కార్యకారణములు విచారించుకాలము. ప్రతి యొకవాక్యమును వ్యవచ్ఛేదమొనర్చి (Analysis) న్యాయశాస్త్రరీతిగను సకలజన సమ్మతియముగను నున్నదియా యని చూచుకాలము మన మతము సర్వజనాదర ణీయముగ నుండునటుల యర్థముఁజేసి పరస్పర విరుద్ధాంశములను సమపరచు కాలము. ఐకమత్యము వృద్ధిపఱచి మనము బాగుపడఁ బ్రయత్నింపఁ దగినకాలము. మతములలోఁ జిక్కులుకల్పించి విరుద్ధములు పెంచుకాలము కాదిది. మన పురాత

నార్యులు దైవనిర్మితములని నిర్ధరించిన నాలుగుజాతులు చాలక నాలుగులక్షల జాతులఁగల్పించు కాలముగాదిది. సిద్ధాంతపడిన నాలుగుజాతులనుండి యనులోమ విలోమ సంగమములను బట్టి స్మృతుల కాలముననే యనేకములగు జాతులేర్పడినవి. ఆక్రమ మెట్లులయినదియు నీ క్రింద వివరించినాను. దానిని మీరు చక్కఁగఁ బరిశీలించి యోజించినచోఁ బ్రతియొక మనుజుఁడు నొక్కొకజాతివాఁడుగ నేర్పడును. అట్లైనచో జాతివైషమ్యము హెచ్చి యైకమత్యము చెడును. మనమది యిచ్ఛయింపఁగూడదు.

## జా తి వి భ జ న.

నాలుగు జాతులనుండి, యనులోమ విలోమక్రమమునఁ బెలిఁగిన జాతులపట్టిక.

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులుగాక ఋగ్వేదకాలముననే జనులనేకవృత్తు లనుసరించి వారువారుచేయు వృత్తులనుండి, జాతినామము లందియుండిరి; కమసల, కిమ్మర కమ్మర రథకార మొదలైనట్టి వృత్తులు పూర్వముననే యుండెను. ఆ వృత్తులు జాతులేమయిన పక్షమునను నా జాతులవిషయము ఋగ్వేదమందేమియుఁ బలుకఁబడలేదు. అయిన నార్యులు పంజాబునుండి గంగా యమునా తీరములుచేరి రాజ్యములు స్థాపించినపిదప యాజ్ఞవల్క్యఋషి పైవృత్తులొనరించు వారికి నీ క్రిందివిధముగ జాతులేర్పఱచెను. అది యెట్లనః—

| | తండ్రికులము. | తల్లికులము. | సంతునికులము. |
|---|---|---|---|
| అనులోమ | బ్రాహ్మణ | క్షత్రియ | మూర్థాభిషిక్త |
| | డిటో. | వైశ్య | అంబష్ట |
| | డిటో. | శూద్ర | నిషాద |
| | క్షత్రియ | వైశ్య | మాహిష్య |
| | డిటో. | శూద్ర | ఉగ్ర |
| | వైశ్య | శూద్ర | కారణ |
| విలోమ | క్షత్రియ | బ్రాహ్మణ | సూత |
| | వైశ్య | బ్రాహ్మణ | వైదేహక |
| | శూద్ర | బ్రాహ్మణ | చాండాల |
| | వైశ్య | క్షత్రియ | మాగధ |
| | శూద్ర | క్షత్రియ | క్షత్రి |
| | శూద్ర | వైశ్య | ఆయోగవ |

పై పట్టికరీతి ననులోమవిలోమ క్రమమునఁ బదునారుజాతు లేర్పడెను. పైరీతిగ నూఱువత్సరముల కొకతూరి జాతివిభజనలు చేసినచో ప్రథమశతాబ్దములోనే రెండువందల యేబదిరెండు జాతులయ్యెను. ఏఁబదిశతాబ్దముల జాతివిభజనలు చేయుచువచ్చినచో నిపుడు హిందూస్థానమునందుండు మానవసంఖ్యకంటెను జాతిసంఖ్య హెచ్చగును. జాతులకు నామములిడను శబ్దములు చాలకయుండును. కావున మన పురాతనార్యులు చేసినముఖ్యములగు నాల్గు విభజనలనే నిర్ధరించి యిటీవలి వారుపెట్టిన కట్టుదిట్టములు త్రోసివేసి మనపెద్దలగు పురాతనార్యుల పద్ధతి నవలంబించుట మనకెల్లరకు క్షేమము దేశమునకు క్షేమము. దీనినుండి మనలో మనకు వైషమ్యములు తగ్గును. ఐకమత్యము హెచ్చును.

నేను పైనవ్రాసినరీతిగ బహు పురాతనకాలమున వర్ణమనఁగా వర్చస్సు ముఖ్యముగ నుండెను. ఈ వర్చస్సు ప్రకృతిసాంబంధిక సాత్త్విక రాజస తామస గుణములపై నాధారపడియుండెను. జనులొనరించు కర్మములుసైతమా గుణానుగుణ్యములుగ నుండెను. ఆర్యులు దేశములుస్థాపించి యే కలఁతలులేక శాంతినందిన పిదప సాంఘిక శాసనములొనర్చిరి. ఆకాలమున నప్పటిజనుల గుణకర్మములనుఁ బట్టి నాలుగువిధములుగ విభజించి నాలుగు నామములుంచిరి. ఆయా విభజనక్రింద వచ్చు జనులాచరింపఁదగిన యాచార వ్యవహారముల నిర్ధరించిరి. ఈ యాచార వ్యవహారనిర్ధారణము వారివారికి ననుకూలముగ నుండవలెనని యేర్పఱచిరి గాని ద్వేషబుద్ధితోఁగాని వైషమ్య కారణమునఁగాని వారాశాసనము లొనరించినవారు కారు. అప్పటివారికి పై యాచార వ్యవహారశాసనము లనుకూలముగ నుండెను గాని ప్రతికూలములని వారుతలంపరైరి. అప్పటివారాచార వ్యవహారశాసనములు ధర్మవిరుద్ధములనిగాని తమకుఁ బ్రతికూలము లైనవనిగాని తలంచియుండినచో నల్లకల్లోలములు సలిపి శాసనములు మార్చుచుండిరి. సకలదేశములందును బ్రపంచమున జనవిభజన గుణకర్మములఁబట్టి యీవిధముగా నేర్పడెననుటకుఁ బురాణచరిత్రములు సాక్ష్యములుగ నిలిచినవి. జాతివిభజనకుఁ గారణ మిదియేను. ఈ విభజనకుఁ దగిన గుణకర్మము లాయాజాతివారియందే యత్యుచ్ఛ్రియ దశకువచ్చి యాగుణకర్మవాసనయే వారివారి సంతతికి సంక్రమించి వంశానుగతముగ వారియందుఁ బాదుకొనెను. బహువత్సరములుగ వంశానుగతమై వచ్చిన తమయాచారములను వదలివేయ నూటికిఁ దొంబదియైదుగురు సమ్మతింపరు. అవి తమకు న్యూనతఁ దెచ్చునవి యనిసైతము తలంపరు మిగత యైదుగురును పాశ్చాత్య విద్యాప్రభావమునుబట్టి మార్పులుకోరెదరు. వారినెదిరించుట యప్రయోజకత్వము, వారు పాశ్చాత్య విద్యా

ప్రభావమున మార్పులు గోరినను నట్టిమార్పులు శాశ్వతముగ నుండవు. వారి దేహమునఁ బెద్దలకాలమునుండివచ్చి ప్రవహించు రక్తసంబంధ నైజగుణము వారినిఁ ద్వరలోనే చక్కఁబెట్టును. క్రిస్టియనులలోఁ గలసిన హిందువులే దీనికి దృష్టాంతములుగ నిలిచినారు. ఈ విషయమున హెచ్చుగవ్రాసినఁ బ్రయోజనంబులేదు. ప్రకృతిసాంబంధిక సాత్త్విక రాజసతామసగుణ ప్రాధాన్యమగురక్త మాయాజాతికిఁ దగినరీతిఁ బ్రతి మానవునిశరీరమందుఁ బ్రవహించు కారణమునుబట్టియే మనపెద్దలొకజాతిస్త్రీని మఱియొక జాతివారికి నివ్వఁగూడదని చండశాసన మొనరించినారు. స్త్రీ పాతివ్రత్యమును దమ ప్రాణముకంటెను హెచ్చుగఁ గాపాడుచువచ్చినారు. వర్ణసాంకర్యమునకు భీతిల్లియే యనేకస్త్రీలు గుంపులుగుంపులుగఁ జితికి నాహుతులయినటులఁ జరిత్రలు దెలుపుచున్నవి. పై కారణములనుబట్టి గుణకర్మములననుసరించి పెద్దలచే నొనర్పఁబడిన నాలుగుజాతులుండినఁ జాలునని నేఁ జివరకు నభిప్రాయపడినాను. పాశ్చాత్య విద్యాప్రభావజనిత తర్కవాదఫలములు బహుకాలమునుండి హిందువుల హృదయములందుఁ బాదుకొనిన మతభావనలందు దూర్చుట బలవద్బాధకము లగునుగాని సహజములుగావు. శాశ్వతముగ నిలువవు.

ఇఁక జనుల గుణవృత్తులకు ననుకూలముగ సాంఘికాభివృద్ధికి సాహాయ్యముగను నార్యులు వర్ణాశ్రమధర్మము లేర్పఱచిరి. మానవ జీవితకాలమును నాలుగు విధములుగ విభజించిరి. "బ్రహ్మచర్యము గార్హస్థ్యము. వానప్రస్థము సన్న్యాసము" ఇవియే నాలుగు విభజనలు. ఈ విభజనలకే యాశ్రమములనిపేరు. బ్రహ్మచర్యాశ్రమునందు శాస్త్రజ్ఞాన మార్జించును. గార్హస్థ్యమందు వేదోక్తకర్మములాచరించుచు, విషయసుఖము లనుభవించుచు సాంఘికధర్మము లనుష్ఠించుచుండును. వానప్రస్థమందు నాత్మవిచార మొనర్చుచుండును. సన్న్యాసమునందుఁ గేవల ధ్యానయోగాత్మిక జ్ఞానమున బ్రహ్మభావమందఁ బ్రయత్నించుచుండును. బ్రాహ్మణజాతికి నా జన్మమునుండియు నాత్మవిచారము ప్రాముఖ్యము గావున నట్టివానికి గురుమూలకముగ శాస్త్ర జన్యజ్ఞానము కర్మాచరణమువలనఁ జిత్తశుద్ధి కలుగును కావున వానప్రస్థమున నాత్మవిచారమునుదిరి సన్న్యాసమునకు నర్హుఁడగును కావున బ్రాహ్మణునకు నాల్గాశ్రమములు విధింపఁబడినవి. కేవల సాత్త్విక గుణమునుఁబట్టి బ్రాహ్మణవర్ణ మేర్పడెను కావున నా జాతివారికి పారమార్థిక విచారముదప్ప నన్యవిచార ముండనందున వారు సన్న్యాసాశ్రమునందుటకు నర్హులైరి. కేవల రాజసగుణమున నేర్పడినవారు క్షత్రియులయినందున వారికి శాస్త్ర

